మించుటకే వచ్చుటకు మఱి యేదైన సాధన ముండవలయును. అందువలన శాస్త్రజ్ఞులు భూమి ఆకాశము అన్నిచోట్లను ఈశ్వరునివలె సర్వవ్యాపకమైన ఒకసాధనమున్న దందురు. అందువలన దానినే ఇంగ్లీషున 'ఈథర్' అందురు. దీనికే సర్వవ్యాపకము అని పేరిడితిని. ఇది సృష్టి యందంతట నిండియున్నను గాలివలెనే కనఁబడదు. ఈసర్వవ్యాపకములో సంచలనము కలిగించుటవలననే 'ఆయతి' భేదముకల తరంగములు బయలుదేఱి పలువిధములగు ఫలితముల నొసంగుచున్నవి. కావున మనము తెలిసికొనవలసిన దేమన ఈసర్వవ్యాపకములో నేవిధమునదైన నియమితమగు ఆయతిగల తరంగములను పుట్టించినచో వాటివలన దూరప్రదేశమున గొంత ఫలితముగలుగును. ఆఫలితరూపమున సమాచారములను దెలుపవచ్చును.

సర్వవ్యాపకములో నీతరంగసంచలనము అతిత్వరితగతినుండును. గాలియందు మాటలు తీసికొనిపోవు తరంగములు సెకనుకు 1170 అడుగులదూరము మాత్రము పోవును. కాని యీ సర్వవ్యాపకమునందు తరంగసంచలనము యొక్కగతి సెకనుకు 186 వేలమైళ్లచొప్పున నుండును. అనఁగా సర్వవ్యాపకములో నొకానొక స్థలమందు సంచలనము గావింతు మనుకొనుడు. అప్పుడు తరంగము లేర్పడుటకు ప్రారంభమగు. ఒక సెకనుకాలములో 186 వేలమైళ్ల దూరప్రదేశమున గూడ తరంగము లగుపడును. అనఁగా భూమిని ఆఱుమాఱులు చుట్టివచ్చును.

## విద్యుత్పరమాణువు (Electron)

ఈతరంగ సంచలనము గావించుటకు విద్యుచ్ఛక్తి సాయపడుచున్నది. అందుచేత దానిని గుఱించి మనము తెలిసికొనవలసియున్నది. విద్యుచ్ఛక్తి ద్రవరూపమైన పదార్థమను నొక సిద్ధాంతము కలదని యీవఱకే చెప్పియుంటిమి. ప్రతివస్తువు రసాయనశాస్త్రజ్ఞుల లెక్క ప్రకారము చిన్నదిచిన్నదిగ విభజించినచో కడపట పరమాణువును సంపాదింపవచ్చును. లోకములోని వస్తువులన్నియు 80 మూలద్రవ్యముల (Elements) యొక్క సమ్మేళనమువలన గలిగినవి. ఇట్టి ప్రతిమూలద్రవ్యము విభజించినచో పరమాణువు అనునది వచ్చును. దానిని విభజించుటకు వీలులేదు. దీనికి గల గుణములేయే మూలద్రవ్యమునుండి అది విభ[illegible]ంచినదో ఆపదార్థమునకుగూడ నుండును. ఇది రసాయనశాస్త్రజ్ఞుని యూహ. కాని ప్రస్తుతము పరమాణువును గూడ విభజింపవచ్చుననియు అట్లు చేసినచో కొన్నివేలు విద్యుత్పరమాణువులు వచ్చుననియు నొకసిద్ధాంతము బైలుదేఱినది.

మూలపదార్థముయొక్క పరమాణువు




1. విద్యుత్ పరమాణువులు

ఉదజని (Hydrogen) పరమాణువునందు విద్యుత్పరమాణువులు రెండువేలు చక్రాకారముగ నున్నచో ప్రాణవాయువు పరమాణువునందు వేలకొలదిగ మఱియొకరీతి నేర్పడియుండును. అనగా పదార్థములన్నియు నొకదానినుండి మఱియొకదానిని మార్చుట కవకాశము గలదు. బంగారము ఇత్తడి ఒకదానిని ఇంకొకదానినిగ జేయవచ్చును. రెండును అసంఖ్యములైన విద్యుత్పరమాణువుల సమూహమే. ఈవిద్యుత్పరమాణువుల నిర్మాణ విధానములను బట్టియు సంఖ్యనుబట్టియు అసలుమూలద్రవ్యము లేర్పడుచున్నవి. ఇక విద్యుత్పరమాణువనగా సూక్ష్మాతిసూక్ష్మమైన యొక కణము. దానికి ఒక ముఖ్యగుణము కలదు. దానియందు శక్తి విద్యుద్రూపమున నుండును. ఈ పై సిద్ధాంతమునుబట్టి విద్యుత్పరమాణువులు ఒకప్రదేశమునుండి ఇంకొకప్రదేశమునకు గదలుటయే విద్యుత్ప్రవాహ మనబడుచున్నది.

ఒకపదార్థమున నీ విద్యుత్పరమాణువులు సహజముగ నుండవలసిన సంఖ్యకన్న నెక్కువ ఉన్నవనుకొనుడు. అప్పుడు దానిచుట్టును సర్వవ్యాపకమునందు ఒకఫలిత మేర్పడును. [illegible] కొనను గట్టివేసి రెండవకొ[illegible]

త్రాడు తనసహజస్థితిలోనికి వచ్చుటకు ప్రయత్నించు నుగాని మనము దానిని అట్లురాకుండ త్రిప్పినచో అది మనవు లోబడినను దానిని మనచేతినుండి వదలివేయ గనే అది మెలియంతయు విప్పికొని యథాస్థితికి వచ్చును. అట్లే పైపదార్థమునందును పరమాణువు లెక్కు వయున్నందువలన జుట్టునున్న సర్వవ్యాపకమునందు

### విద్యుత్ పరమాణువుల నెక్కువగాగలపదార్థము



1 కాంతీకరణ రేఖలు. 2. విద్యుత్ కిరణములు.

ఒక మెలియేర్పడును అనఁగా ఆపదార్థము చుట్టును గొంగళిపురుగుయొక్క వెండ్రుకలవలె కిరణము లేర్పడును. సూర్యకిరణములవలె నివి మన చర్మనేత్రములకు గానరావు. కాని సూర్యకిరణము లెట్లు వెలుతురిచ్చు చున్నవో అట్లే యివికూడ విద్యుత్ఫలితముల నొసంగు చున్నవి. ఈ పైజెప్పిన పదార్థము ఒకప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు బోవుచున్న దనుకొనుడు. అప్పుడు దానిచుట్టునున్న విద్యుత్కిరణములుకూడ దాని ననుసరించిపోవు చుండును. విద్యుత్తు + చలనము = కాంతీకరణము. అందువలన కాంతీకరణశక్తి పైఁజెప్పినపదార్థము పోవుచున్నప్పుడు దానిచుట్టు సాలి పురుగుయొక్క గూటివలె రేఖలు నేర్పడును. అనఁగా విద్యుత్ఫలితములకు కాంతీకరణఫలితములు సమకోణముగ నుండును. ఈపైఁజెప్పిన పదార్థమునందు విద్యుత్పరమాణువులు ఒక సెకనుకాలమునఁ దీసివేసితిమనుకొనుడు. అప్పుడు జరుగునదియేమి? ఫలితములన్నియు వెంటనే నశింపవు. గుఱ్ఱముమీద స్వారీచేయున్న రౌతు ఎంతనిపుణుడైనను [illegible]డు ముందుకు తూలకుండునా? అట్లే పైనిచెప్పిన రేఖలన్నియు నశింపకుండ ముహూర్తమాత్రము నిలిచియుండును. అంతలోనే మఱల విద్యుచ్ఛక్తిని ఆపదార్థమున ప్రవేశపెట్టితి మనుకొనుడు. అప్పుడు రేఖలన్నియు మఱల నేర్పడును. కాని పూర్వపువాటికిని వీటికిని గొంచెము భేదముండును. తగరపు రేకు దాకదానిని తీసికొని ఇటునటుత్రిప్పి మఱలమఱల వంచినచో నేమగును? తునిగిపోవును కదా? విద్యుత్పరమాణువులు త్వరితగతిని ఉండుచుఁ బోవుచు నుండుట చేత పైజెప్పిన రేఖలు పదార్థమునుండి విడిపోవును.

### విద్యుత్ప్రవాహముయొక్క మార్పువలన తునిగిపోవు కిరణములు



1. పదార్థము 2. రెండవకిరణము. 3 మొదటికిరణములు.

అనగా సర్వవ్యాపకమునందు సంచలనము గలిగించిన వారమగుచున్నాము. ఒక పదార్థమునందు గాక ఒక పొడుగుపాటి తీగెయందు విద్యుత్ప్రవాహము నొకదాని నేర్పఱచి ఆప్రవాహమును క్రిందికి పైకి వానపామువలె బలువిడునట్లు చేసినచో సర్వవ్యాపకమునందు విద్యుత్కిరణములను ప్రసరింపజేసినవారమగుచున్నాము. ప్రతిక్షణము ప్రవాహము చంద్రబింబముమాదిరి మార్పునందుచు వచ్చినచో మేరలేని సంచలనము కలిగింప వచ్చును. ఈసంచలనమే తరంగరూపమునఁ గొన్నివేల మైళ్లు పరువెత్తును.

ఈకిరణములమూలముననే అనగా నీవిద్యుత్ఫలిమును గలిగించు సర్వవ్యాపక తరంగముల (Ether waves) మూలమున సమాచారమును నాల్గుదిశల బంప వచ్చును. ఒక రెండునిమిషములు తరంగము లుద్భవించు నట్లుచేసి మఱియొక నిమిషమాగి మఱల నాల్గునిమిషము లుద్భవింపునట్లు చేసినచో నిది మార్సుకోడ్డులోని

చుక్క గీతను సూచించునుగదా. అనగా ఇంగ్లీషులో ఏ అను అక్షరమును బంపుచున్నాము. ఈతరంగములు త్రుంచబడిన కిరణములు నలుదెసల పర్వెత్తుట




1. త్రుంచబడిన విద్యుత్ కిరణములు. 2. పొడవైన తీగె. 3. విద్యుత్ కిరణములు. 4. విద్యుత్ పరమాణువులు.

దూరమునఁనున్న యొక రాగితీగె యెదుర్కొనినచో దానియందు విద్యుచ్ఛక్తి పుట్టునట్లు చేయును. ఇట్లు పుట్టు విద్యుద్రాశివలన పంపబడిన సమాచారమును దెలిసికొనవచ్చును. ఈవిషయము ముందు వివరింపబడును.

సముద్రముమీద ప్రయాణముచేయు నావికులకు రాత్రులు భూమిని సూచించుటకు ఒక దీపస్తంభము (Light house) చెన్నపట్టణమునఁ గలదు. దానియందలి కాంతిపుంజము రాత్రులందు గిఱ్ఱున గుండ్రముగ చక్రమువలె తిరుగుచుండును. ఇట్లుతిరుగుచున్న వెలుతురు కిరణములను ఒకానొక ప్రదేశమున నొకనియమితపద్ధతి ననుసరించి పడునట్లు చేసినచో సమాచారములను ఈదీపస్తంభమువద్దనుండి ఆప్రదేశమునకు దెలియునట్లు చేయవచ్చును. వాయువార్తాపద్ధతియు నిట్లే ఒకవాయువార్తాకార్యాలయము (Wireless station) నుండి యగో

వాయువార్తా కార్యాలయము

1. విద్యుత్ ప్రవహించు తీగెలు. 2. కార్యాలయము. 3

చరమైన విద్యుత్కిరణములు నియమితపద్ధతిని ప్రసరించునట్లు చేసెదరు. వీటినే దూరప్రదేశమున మఱొక కార్యాలయమున సంగ్రహింతురు.

ఇంతవఱకు ప్రధానాంశపరికరములను సవరించుకొనుట తోడనే సరిపోయినది. ఇల్లలుకుట మొదలుగాగల యెన్నిపనులో ముందుచేసిననే గదా పండుగ వచ్చుట. అట్లే యేశాస్త్రవిషయమైనను దెలిసికొనదలచినచో ముందుముందు గొన్ని సంగతులు నేర్చుకొనవలయును. తంతిలేని వాయువార్తాపద్ధతిని దెలిసికొనుటకు పైసంగతులు నేర్చుకొనిన జాలును. మిగిలినదంతయు సులభసాధ్యమే.



# చాటూక్తులు

నడకుదుటి వీరరాజకవి గారు

౧. జీడిమావిడిపండు

సీ. లలితంపు జిగిఁగుల్కు కలికివాతెఱఁ దళ్కు, లొత్తునారుణరోచు లొక్కచోట,
పరువంపుఁబస నింపుపడఁతిచెక్కుల సొంపు, లొలుకుపాటలశోభ లొక్కచోట,
చెలువంపువగఁ జిల్కు వెలఁదినెమ్మొయి బెళ్కు, లొప్పుకాంచనదీప్తు లొక్కచోట,
మురిపంపుసిరి నించు ముగుదచూపుల మించు, లొలయుమేచకకాంతు లొక్కచోట,
వెలయు నిను శీతసురభిళవిమలసరస, మధురరుచులఁ బోలియుఁ దనమనసు మృదువు,
గామికిఁ దపించు నలసహకారఫలము, మాయురే! ధన్యమవు! జీడిమావిఫలమ!

తే. గీ. పసుపుఁజాయల నిగ్గులు మిసిమి దేఱఁ, గూరిమిని నీసుంగు నోడిఁ జేర్చికొనుచు శీవి,
నలరుఁగొమ్మలనడుమ నుయ్యాలలూఁగు, నీవిభవ మెన్ననగు! జీడిమావిఫలమ!

* * * * * * * *

చ. పుడమి సమస్తవృక్షఫలముల్ దమగర్భములందు బీజముల్
గడుకొని దాఁచి ప్రోవ నధికత్వముఁ జూపనో నీదుగింజఁ బై
నిడుకొని తంచు ముద్దుమెయి నిట్టెనినుం గొఱుకంగ నయ్యయో!
అడరుచు జీడిమావిఫలమా! నను గొంతుకఁ బట్టుకొందువే?



# తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును

సుసర్ల సూర్యప్రకాశము గారు.

"అబ్బబ్బా!! బడిబడియని మాయమ్మ నన్నుఁ జంపితిని వేయుచున్నది. బలవంతముగఁ బుస్తకములు చేతిలోఁ బెట్టి ప్రతిదినము నన్ను బడికి సాగనంపుచుండును. ఆమెకేమి తెలియును నాకష్టము. బడికిఁబోవుట యనఁగా గోలీలాడుటా? గోపురాలెక్కుటా? లెక్కలఁట. పాఠములఁట. ఛీ ఛీ! వాటి మాటయన్న నాకుఁ దలనొప్పి. పూర్వమొకటి కనియు రెంటికనియు వంకఁ బెట్టుకొని వీథులలోఁ దిరుగు జతగాళ్లతో దాగుడు మూతలాడుకొనుచుండెడివాఁడను. ఇదియేమి కర్మమో యీ దొంగతనము కనిపెట్టి కాఁబోలట్టిటు కదలకుండఁ బట్టుపట్టి కూర్చుండఁ బెట్టుచున్నారు. అయ్యో! ఈమాయ చదువెక్కడి నుండివచ్చెను నాయనా! ఇఁక నేను వెళ్లను. ఈరోజు మొదలుకొని బడికిఁబోయినఁ గోమటి కొడుకును కాను" అని యొట్టుబెట్టుకొని చేతిలోని పుస్తకము లొకరి దొడ్డిలో మూలనున్న మునగచెట్టు మొదట జాగ్రత పెట్టి తల్లిదండ్రులతోఁ జెప్పకుండఁ దనయక్కగారి యూరికిఁ బ్రయాణమై పోవుచుండె నొక కోమటికుఱ్ఱవాఁడు.

పిల్లవాఁడు చేరవలసిన గ్రామము చేరకమునుపే సూర్యుఁ డస్తాద్రిఁ గ్రుంకెను. బాలకుఁడు దారితప్పి యక్కగారియూరికి మారు చిత్రాడ యను పల్లెటూరు ప్రవేశించెను. తనవారి యూరుకాదని తెలిసికొనినతోడనే దిగులుపడఁ జొచ్చెను. ఆకటిచేఁ గడుపు నకనకఁబడుచుండెను. నిద్దుర ముందు వెనుకలకు జోగాడించుచుండెను. తిరిగితిరిగి తుదకొక యూరి వెలుపలి మేడయరుఁగుపైఁ బండుకొనియుండెను.

"ఓసీ! తెల్లవారిపోవచ్చెనే! నీకైన మెలఁకువ రాకపోయెఁగదా! జామురాత్రియైన లేదు. ఇప్పుడెక్కడ ప్రయాణము. తత్‌క్షణము వంట ప్రయత్నము చేయుము. భోజనముచేసియే ప్రయాణమయ్యెదను" అని యొకకాపాతని భార్యతోననెను.

"వంటయన నెంత? కూరయేమియుఁగానరాకున్నది." అని యాతనిభార్య పలికెను.

"అట్లయిన బట్టనపుఁ బిల్లను బలియిచ్చెదను" అని చేతఁ గత్తిఁబట్టుకొని దొడ్డిగోడలో నమర్పఁబడిన కోళ్ల గూటిని సమీపించెను.

"నన్ను చంపకు బాబూ! నన్ను చంపకు! చంపకు" అని కేకలు వేయుచు గూటిలోనుండి యొక కుఱ్ఱవాఁడు బైటఁబడెను. కాని కోళ్ల చప్పుడేమియు వినఁబడుటలేదు. ఆకాపువాని జూచినతోడనే "ఓరి కోళ్ల దొంగా! దొరకితివిరా! దీనిలోని కోళ్లనేమి చేసితివో చెప్పుము. లేకున్న నీ ముక్కు, చెవులు కోసివేయుదును" అని యతఁ

బాలకుఁడు:—నేను దీనిలో దూరు నప్పుడు పారిపోయినవి.

కాపు:—దీనిలో నేల దూరవలెను?

బాల:—నీవు చంపెదనన్నావుకాదా?

కాపు:—ఛీ! దొంగా! నీవు నా కెప్పుడగపడితివి?

బాల:—అగపడలేదు. పట్టణపుఁబిల్లను బలియిచ్చెదనని నీవు యింటిలోననుచున్నావు. ఆమాటవిని నన్ను చంపెదవని యిక్కడ దాగికొన్నాను.

కాపు:—(కొంత గ్రహించి) మీదే యూరు?

బాల:—పిఠాపురము.

"ఓహో యిదియా కారణము. ఓ వెఱ్ఱిపిల్లవాఁడా! భయపడకు. నిన్నేమియుఁ జేయను. మాయూరిసంతలో నిన్ననొక కోడిపిల్లను గొనితెచ్చితిని. నేఁడు దానిని గూరచేసికొనఁ గోరి పట్టణపుఁ బిల్లను బలియిచ్చెదనని యంటిని. నీవును బట్టణఁపువాఁడవగుట నిన్నుఁ జంపుదునని భ్రమించితివి. రమ్ము" అనిచోరఁదీసి వాని వృత్తాంతము సవిస్తరముగఁ దెలిసికొని యాబాలకుని తలిదండ్రుల దాపునకుఁ దరలించెను.

గీ. ఒకని నిర్దోషవాక్యంబు నొకఁడు కపట
వచనముగ నెంచి యాత్మను వందు రొకఁడు
కయ్యమును బెంచు నొక్కఁడు కష్టవితతిఁ
గాంచు విభ్రాంతమతిని నిష్కారణము

---

# పూలకన్నె

ఏనుఁగు లక్ష్మిరాజు గారు

చిన్ని చిన్ని పూలు
చిన్నారిపూలు
సొగసైనపువ్వులు
సొంపైనపూలు
గోరింటపువ్వులు
గొబ్బిపువ్వులు
భ్రమియింపఁ జేసెడు
పసిఁడిపువ్వులు
అందమైన మంచి
చందనపూలు
మందారకుసుమాలు కురు

పువ్వులన్ని పైఁడి
బుట్టలోఁ బెట్టి
బుట్ట చేతఁబట్టి
పొలఁతియిటురాగ
పొలఁతి యందచంద
ములు తిలకించి
కలవరపడసాగె
గాంతునిమనము
మనమునం దెంతటి
మహిమలుండునో
మహిమలు దెలియంగఁ
మనదా నవమూనె?




విశ్వనాథ సత్యనారాయణ గారు

మహాశ్వేత సహజసుందరి. ఆమెసౌందర్యము మసృణమృణాలమధురము. ఆమె కెందుచేతనో కృత్రిమసౌందర్యము నెడల వైముఖ్యము. తస్మాత్ నగలమీద నామెకు నిరాకరణ.

నిరాభరణసుందరమైన యామె శరీరచ్ఛాయను చూచి లోకము మెచ్చుకొనలేక పోయినది. పో. అమంగళవాక్యములు కూడ నది. పాప మది యామెకు తప్పక తగిలినవి.

నీలలోచనుడు బ్రదికియున్నపుడు మహాశ్వేత సుమంగలివలె కన్పించలేదు. నేడు భర్తృవిహీనవలెను కన్పించుటలేదు. సౌమంగల్యము కన్న వైధవ్యముకన్న విభిన్నమైన యొకలక్షణమామె మొగమున నిండియున్నది. అది సౌందర్యమేమొ! ఆమెవంక చూచిన నడ విపూవులు వికసించినట్లుండును.

మహాశ్వేత కృత్రిమసౌందర్యము నెడ నెంతవిముఖియో బ్రదికియున్నపుడు నీలలోచనుడు ఆసౌందర్యము నెడ నంత సుముఖుడు. అతడు శ్వేతకక్కఱలేనన్ని నగలు చేయించినాడు. రకరకములు చీరలు కొన్నాడు. అవన్నియు పెట్టెలో మూల్గుచుండును. జరీయంచుగల తెల్లని పట్టుచీర కట్టుకున్న శ్వేత యుషస్సతివోలె ప్రకాశించును. నీలలోచనుని కన్నుల కది కంటగింపు. ఎప్పుడైన భర్త బలవంతముః నామె రంగుచీరకట్టి, నగలుపెట్టుకొనున యతడు కాలు గడపకదిపిన వెంటనే న లన్నియు తీసి తన తెలిపట్టుచీర కట్టుకుని శరన్మేఘముచాటు చంద్రశలాకవలె పూదోటలో విహరించుచు నూపిరి తీసికొనును.

మహాశ్వేత గొప్పయింటిబిడ్డ. ఆమెతండ్రి యామెను సంస్కృతాంధ్రములయందు చక్కని పండితురాలిని చేసినాడు. ఆమె రసగ్రహణ పారీణ. విద్యావికాసముచేత, శరీరముతో పాటు, ఆమె మనస్సుకూడ క్రమక్రమముగ లేతయరటియాకువోలె సౌకుమార్యసీమమైనది. ఆమెమనస్సు భావతరంగములలో చిఱునావ వలె విహరించుచుండును.

ఆమెకు నామెభర్తకు మధ్యనున్న ప్రేమసూత్రములు మృణాలసదృశములు. సౌందర్యవిషయమున నిద్దరిభావము లేకీభవించలేదు. ఈమెకు మల్లెపూవన్నిన యిష్టము. అతనికి మందారపుష్పముమీద నభిమానము. ద్విధాస్రుతంబులగు వారిజీవనవాహినులు, పాపము, కలియలేదు.

ఇప్పుడు మహాశ్వేతకు పదునెన్మిదవ యేడు. ఆమెకు పదునారేడులు రాకమునుపే నీలలోచనుడు గతిం— —.సంవ

త్సరమువరకు, శ్వేతజీవితము ప్రశాంతగంభీర మైన నదివలె ప్రవహించినది.

ఒకనాడు శ్వేత పూలతోటలో నొంటరిగా తిరుగుచున్నది. తాను పెంచుచున్న లేడికూన వెంటనే వచ్చుచున్నది. నడచుచు నడచుచు పోయి యామె యొకచోట నిలువబడినది. ఆప్రక్కనే యొక మందారవృక్షమున్నది. అది యాపాదమస్తము పూచి తంగేడువలె సంధ్యాసతివలె కొట్టవచ్చినది. ఆ మొక్క, నీలలోచనుడు, శ్వేతసౌందర్యాభిప్రాయములను భేదించుటకుగాను, రెండుసంవత్సరముల క్రింద నాటినది. నేటి కది కుసుమిత మైనది ... డు మాత్రము లేడు. ఆమందారమువంక చూచినతోడనే శ్వేతకు కన్నులు తిరిగినవి. ఆరక్తశోభలో నేమోయున్న దనిపించినది. ఆయెఱ్ఱని కాంతులకుతాళలేక శ్వేత నిలువెల్ల వణకిపోయినది. కన్నులు మూసికొన్నది.



ఆహా! అదియేమి? అదియేమి? కన్నులు మూసికొన్నంత నెవ రా యెదురుగా ప్రత్యక్షమైనది? ఆహా! నీలలోచనుడా! ప్రసన్నదీన మైన యావదనము మహాశ్వేతవంక కనురెప్ప వాల్చక చూచుచున్నది. ఆ ప్రసన్నదీనతా మాధుర్యమున కాగలేకపోయినది శ్వేత. కన్నులు తెఱచినది. ఎదుట మందార వృక్షముప్రక్కన లేడిపిల్ల.

మనస్సునకు భారము తగ్గలేదు. ఆమెపైకి యేదో మార్పు వచ్చినది. తనగదిలోనికి పోయి ప్రక్కమీద పరున్నది. శ్రమచేత కనులు మూతపడినవి.అహో!కన్నెదుట నదియేమి? మరల నా నీలలోచనుని వదనము. శ్వేతకు భయము వేసినది: కనులు తటాలున తెరచినది. ఆమె కేమియు తోచలేదు. గది నాల్గువంకలు చూచినది. లేచిపోయి, యచ్చటనున్న బీరువా తీసినది. నీలలోచనుడు, సంవత్సరముక్రింద కొన్న, యెర్రని పట్టుచీర బీరువా యడుగుభాగమున నేవియో పుస్తకములక్రిందనలిగిపోవుచున్నది. అదితీసినది. కట్టుకొన్నది. ఆతీసికొనుటకు కట్టుకొనుటకు గంటసేపుపట్టినది. శ్వేతతల్లి యానాడామెవంక నివ్వెఱపోయి చూచినది. ఆ చూపుసరిగా నీలలోచనుడు చూచినట్లున్నది.

ఆరాత్రి యామెకు నిదుర పట్టలేదు. కళ్లు మూసుకొన్నచో నీలలోచనుడు. ఇంక భయముచేత శ్వేత కన్నులు మూయలేదు. ఏరాత్రి వేళనో కనులమూతకన్న నిద్రయే ముందుగా వచ్చినది కాబోలు.

మఱునా డామె ప్రొద్దెక్కి లేచినది. తగినంతకాలము నిద్రించుటచేత నామె దేహము కొంచెము తేలికగానైనది. అదిమొద లామెకు సౌందర్యవిషయమున నభిప్రాయములు మారినవి. రంగుచీరలు తక్క నామె యిప్పుడు మఱొక్కచీర కట్టదు. తల్లి వలదన్నకొలది, యూరివారు చెప్పుకొన్నకొలది, నగలు ధరించుచున్నది. ఇందుకు కారణ మున్నది. కనులు మూసినచో నామెకు నీలలోచనుడు ప్రత్యక్ష మగుచున్నాడు. ఆతడు కనపడకున్న బాగుండు నని యున్న దామెకు. ఆమె యేమి చేయగలదు. నిస్సహాయయై పోయినది. కనులు మూసెనా అతన్ని సాక్షాత్కారము.

అతడు కనంబడినపుడెల్ల నామె కమిత భయము వేయుచున్నది. ఆమె తెల్లచీర కట్టుకుని, యొడలెల్ల నాభరణములు తాల్చినపుడు, కనులు మూసికొనుట తటస్థించెనా, అపుడును నీలలోచనుడు కన్పించుచున్నాడు; కాని, యామె కెందుచేతనో భయముగా నుండదు. విగతభూషణయై తెల్లచీర తాల్చియున్నపుడు కర్మము చాలక కనులు మూసిన దనుము, పాప మ్మామె కేకొండయో విఱిగి వచ్చి నెత్తిపై పడునన్నంత భీతి కలుగుచున్నది.

ఈమార్పు జరిగి నేటికి సంవత్సరమైనది. శ్వేత కిప్పుడు పదునెన్మిదవ యేడు. ఈసాయంకాలమున నామె యభ్యంగనము చేసి సర్వావయవములయందు మనోజ్ఞభూషణములు తళతళలాడ, సంజయెఱుపు బంగరుపువ్వుల బనారసుచీరకట్టి తోటలోనున్న చలువరాతిపై తల విరియబోసికొని యారబెట్టుకొనుచున్నది.

అప్పటి యామె యాసౌకుమార్యమును ఆనందమును ఆ దృగంతవిన్యాసవైఖరులును చూచినవారి కామెవాసకసజ్జికవలె తోచును. అపు డొక్క మలయపవనకిశోర, మా పుష్పవాటికాసుగంధాకృతి, మెల్లగా నామె మీదకు వీచినది.

దూరమున నెవరో వచ్చుచున్నట్లైనది. శ్వేత అటుచూచినది. మందార మటుపోయినది. ఎదురుగా రాధారాముడు కనంబడినాడు. ఇరువురు నొకరి వంక నొకరు నిశ్చలముగాం జూచుకొనిరి. అరనిముసము ప్రపంచకము మాట వారికి తెలియలేదు. మరల నొక్క గాలికెరటము వచ్చినది. శ్వేత యులికిపడి చీర సర్దుకొని చలువఱాతిమీదినుండి లేచి తొలగిపోయినది.

రాధారాముని శ్వేత యిదివరకు సరిగా చూడలేదు. కాని యాతని నామె యెఱుగును. 'అతని పేరు రాధారాంశ్రీ' ఇతడును శ్వేత యన్నగారగు మధుకాంతుడును స్నేహితులు. రాధారాం బొంబాయిలో నొకపత్రికకధిపతిగా నున్నాడు.. మధుకాంతుని చూచిపోవుటకు వచ్చినా యునద్ది

వి[illegible] యతనికి తెలియును. అతడును ఇదివర కామెను పరీక్షగా చూడలేదు. నేడామెయందము యాతని సమ్మోహితుని చేసినది. రాధారాం తత్త్వజ్ఞానసభవాడు (Theo-sophist). ఇంతవరకు బ్రహ్మచారి.

ఇరువురును ఎవరిదారిని వారు వెళ్లిరి. దీపములు పెట్టువేళకు శ్వేత తాను క్రొత్తగా నాటిన మందారమునకు, తోటమాలి నీళ్లు పోసెనో లేదో చూచుటకు తోటలోనికి వచ్చెను. ఆమందారము తానింతకుముందు కూర్చున్న చలువరాతికి దగ్గరలో నున్నది. శ్వేత చూచినది. మందారము బోదెలోపోసిన నీళ్లు పీల్చుకొనుచున్నది కాని లేడిపిల్ల దాని చివుళ్లన్నియు కొరికి తిన్నది. శ్వేతకు విసువు పుట్టి చలువరాతిమీద కూర్చుండబోయినది.

శ్వేత కాశ్చర్యమైనది. ఆచలువరాతి మీద రెండు తెల్లగులాబిపూవు లొకటిగా కట్టి యుంచబడెను. శ్వేత యాపూవులవంక నిశ్చలముగాఁ జూచినది. ఒక్క యరనిముసమామె యచ్చోట నిలుచుండి నెమ్మదిగా నింటిలోనికి పోయినది.

సంజచీకటులు వచ్చినవి.

రాతిరి పదిగంటలు కావచ్చినది. శ్వేత తనగదిలోనికి పోయినది. దీప మెక్కించి తన శయ్యకు దగ్గరగా నుంచి చదువుటకు కాదంబరితీసినది. ప్రక్కపైకూర్చుండ బోవుసరికి యామె యాలోచనా నిమగ్నయైనది. ప్రక్కమీద నా రెండు గులాబిపూవులగుత్తియు కనబడినది. ఆమెహృదయము నేదియో తాకినట్లైనది. ఆమె కొంచెముసేపట్లే నిలిచి ఆ పూగుత్తి నెమ్మదిగా దీసి దూరముగానున్న బల్లపైనుంచి పరుండి చదువనారంభించెను. చదువు సాగలేదు. విసిగి చివరకు దీపము తగ్గించి యటుతిరిగి కనులు మూసికొనెను. నిరంతరము ప్రసన్నదీనముగాజూచు నీలలోచనుని ముఖము నేడేలొకో తేజోహీనముగా నున్నది. తేజోహీనతకాదు, ప్రసన్నదీనముగానే యున్నది కాని మునుపటి యంతగా లేదు.



రాధారాం మఱునాడు వెళ్లినాడు. అతనితో మధుకాంతుడును వెళ్లినాడు. మూడవ రోజున మధుకాంతుని చిరునామాతో రాధారాం సంపాదించుచున్న పత్రిక మధుకాంతుని యింటికివచ్చినది. ఇదివర కాపత్రిక యిచ్చటికి వచ్చుటలేదు. తపాలావానివద్దనుండి శ్వేత యాపత్రిక నందుకొన్నది.

ఒకనాడు శ్వేత తోటలో తిరుగుచున్నది. లేడిపిల్ల పిలకలు కొరికివేసినందున కాబోలు ఆమందారపుమొక్క చచ్చిపోయినది. అచ్చటినుంచి నెమ్మదిగా మూడుసంవత్సరముల క్రింద నీలలోచనుడు నాటిన మందారము వద్దకు పోయినది. అది శిశిరర్తువు. మందారమింకను కొంచెముగా పూయుచునేయున్నది. ప్రొద్దు గ్రుంకినంతనే చలివేసి యామె నేలువ కప్పుకొని పోయి పడుకున్నది. తలనిండ ముసుగువైచుకుని కళ్లు మూసికొన్నది. నీలలోచనుడు దూరదూరముగ పోవుచున్నట్లైనది. ఇంతలో నెవరో వెనుకనుండి తన్ను తాకినారు. వెనుతిరిగి చూచినది. లేడిపిల్ల. ముద్దుగా లేడిపిల్లను దగ్గరకు తీసుకుని దాని మూతి చేతితో పట్టుకున్నది. గిన్నెవలె నున్న మందారపూవులో లేడి మూతిపెట్టినది కాబోలు దానిముట్టె యంతయు మందారకుసుమకింజల్కములే. శ్వేత లేచి కూర్చుండి తన పైట చెఱగుతో దానిముట్టె తుడిచ్చి శుభ్రముచేసి దానిని కౌగిలించుకుని దానికి గూడ నేలువ కప్పెను. అది యూపి రాడక వదలించుకుని పాఱిపోయినది.

రాధారాం దగ్గరనుంచి శ్వేతకు ...రుచు ... నుత్తరములు వచ్చుచుండెను. ఆమె మాత్రము నూటికి కోటి కొక్కసారి జవాబు వ్రాయుచుండెను. శ్వేతలో మరల నేదియో యింకొకమార్పు గోచరించుచున్నది. అది హఠాత్తుగా నొక్కసారి కలిగినది కాదు గాన నదియేమో తెలియుటలేదు. అది క్రమక్రమముగా సువ్యక్తమే యగుచున్నది.

ఆమె యిపుడు ఒత్తురంగుచీరలు కట్టుట మానివేసినది. గులాబిరంగు గోదుమర్రంగు మొదలగు లేతరంగులచీరలు కట్టుచున్నది. ఒడలిమీద భూషణములు కొద్దిగా తాల్చుచున్నది. మునుపటికన్న నామెమొగములో నుత్సాహము ద్యోతక మగుచున్నది. ఆమె శరీరసౌందర్య మంతంతకు ...ల్లుపూవువలె మొగలిపుప్పొడివలె తెల్ల...నవలె నొండు విరిగిపోయిన కొలువువలె మల్లెపూవువలె నిగనిగలై సొగసు మీఱుచున్నది. చకితములైన యామె లోచనములు అంతంతకు నిశ్చలములగుచున్నవి.

శిశిరము వెనుక బట్టినది. మందారము పూయుట మానినది. మల్లెతీవ విరియబూసినది. ఆపూతోటలో శ్వేత యొకయుత్తరము చదువుకొనుచు నడచుచున్నది. ఆమె చేతులకు సన్నని బంగారు మురుగులును మెడలో నొక బంగరుగొలుసును మాత్రమే యున్నవి. జరీపోగులుగల తెల్లనిపట్టుచీర యామె యొడలిపై శరత్కాలమేఘశకలము వలె వాయుధూత మగు...

రాధారాం వచ్చినాడింతలో. ఒకరొక్కరు కౌగిలించుకొన్నారు. తాను చదువుచున్న



యుత్తరమును శ్వేత మాటుచేసినది. రాధారాం దానివంక చూచి యామెకు తెలియునట్లు నవ్వినాడు. రాధారాం శ్వేతవంక నిలువున చూచి యామె యానాటి వేషము మిక్కిలి రమ్యముగా నున్నదని చెప్పి మఱునాటి మధ్యాహ్నము తమ పెండ్లి వేళ నామె నట్లే వేషము సంతరించుకొమ్మని చెప్పినాడు.

శ్వేత కొంచెము లజ్జావనతవదనయైనది. రాధారాముని కా లజ్జామధురిమవలన నానందమై యామెనుకౌగిలించుకుని యామె చుబుకమునెత్తి యా యెఱ్ఱని పెదవులపై నొక చుంబనము చేసినాడు. అప్పటి యానంద పారవశ్యమున నప్రయత్నముగా శ్వేత కనులు మూతపడినవి. శ్వేతకు చప్పున తెలివి వచ్చినది. నీలలోచనుడు కనంబడ లేదు. ఆమె కాశ్చర్యమైనది. అది నిజమో అబద్ధమో అని తరువాత పదినిమేషములలో నామె యొకవందసార్లు కనులుమూసికొన్నది. నీలలోచనుని చిహ్నముకూడ లేదు. అదిమొదలామె జీవితాంతమువరకు మరల నామెకు నీలలోచనుని రూపము కనిపించలేదు.

# నెరప్రొక్కమ్ము

## సవరణ

భారతి సంపుటము ౧. సంచిక ౧౨.

ఈ సంచికయందు "భారతీవందనము" అనుపద్యమున (౪౧ వ పుట కెదురు) "జ్ఞాన ముక్తి" కి బదులుగ "జ్ఞాన ముద్రాయుక్తి" అని చదువునది.



# మార్గాన్వేషణము

దుర్గమహంతి సీతారామ శర్మ గారు

గగనభాగంబు మేఘసంకలితమగుట
గాఢతిమిరంబు దిశలెల్లఁ గ్రమ్ముకొనుటఁ
గన్గొనఁగలేక దుర్గమగహనసీమఁ
జిక్కితిని గమ్యభవనంబు సేరుటెటులొ !!

గీ. అభ్రనిర్గతకరకాప్రహారములను
శీతవాతతరంగ సంఘాతములను
గొయ్యవడి బిగువెల్లను గోలుపోయి
బడలి తనువెల్లఁ గంపింపఁదొడఁగె నకట!

గీ. శ్రుతిపుటకఠోరమై ప్రతిశ్రుతుల నీని
వనమృగారావము ల్వినవచ్చుచుండె
మృదులనవనీతహృదయంబు చెదరదొడఁగె
నక్కటా! ముక్తిమార్గంబు దక్కుటెటులొ?

గీ. కంటకపరీతమై కాలుఁ కదలుపుటకుఁ
గూడ నళుకొదవించె నీ జాడలెల్లఁ
గష్టములపాలుగాక సౌఖ్యముగ గమ్య
గృహము సేరంగ సత్పథం బెయ్యదియొకొ!

గీ. కారుచీఁకటి నెద్దియుఁ గానరాదు
మెఱపుఁదీఁగ నిశ్చలముగా మెఱయఁబోదు
మొగులుచాటున దాఁగిలిమూఁతలాడు
మించు నాసించిపోవ నూహించునెడల
మధ్యమార్గంబునం దేమి మాయ కలదొ!

గీ. మారుతోద్వేలమున రూపు మాసిపోక
వర్షధారాహతిని గాంతివాసి చనక
ధ్వాంతవిధ్వంసమై శాశ్వతప్రభలను
గలుగుదీపిక నెన్నఁడు కాంచఁగలనొ!

గీ. కడలు తెలివొందుజాడయే కానరాదు
పూర్వదిశ వేగుఁజుక్కయే పొడమలేదు
లోకబాంధవదివ్యావలోకనమున
కర్హమై కృతకృత్యుండ నగుట యెపుడొ!

గీ. ప్రమదభవనాంతరమునఁ బూఁబాన్పుమీఁద
నచలితాత్ముండ నగుచు నే నధివసించి
శ్రమమువాయంగ నమృతగానమును వినుచ
గాలమంతయు హాయిగాఁ గడపు టెపుడొ





## కాశీనాథుని భైరవమూర్తి గారు

[మొదటి సంపుటము—పదునొకండవ సంచిక తరువాయి]

శ్లో. ఐందేవాగ్భవమైందవాత్మసదృశం వేదాదివిద్యాగిరో, భాషా దేశసముద్భవాఃపశుగతాః ఛందాంసిసప్తస్వరాన్,
తాళాన్ పంచమహాధ్వనీన్ప్రకటయ త్యాత్మప్రసారేణయ, త్తద్బీజంపదవాక్యమానజనకం శ్రీమాతృకేతే పరమ్.
(దేవీమహిమ్న స్తవమ్)

ఇంతకుఁబూర్వము మూర్ఛనా వివరము లుదాహరింపబడినవి. ఈమూర్ఛనలందు గల్గు తానభేదవివర మిందు వ్రాయబడును.

శ్లో. తానా స్స్యుః మూర్ఛనా శ్శుద్ధాః,
షాడవౌడవితాః.—(సం॥ రత్నాకరం)

తన్యతే=విస్తార్యతే, అనగ విస్తరింప జేయబడునట్టిదిగనుక 'తాన' మనబడుచున్న దని శార్ఙ్గదేవ ప్రణీతసంగీతరత్నాకరమునకు వ్యాఖ్యానకర్తలగు కల్లినాథులనువా రుదాహరించియున్నారు. మూర్ఛనలలో శుద్ధము లగునట్టివి తానములనియునిరూపించిరి. వీటిలో స్వరముల విస్తరింపు లేక గుణించుటయనియు గలదు. దీనియందు రెండువిధములు: శుద్ధ తానము, కూటతానము. ఒక్కటేరాగమును ప్రకాశిల్లున··· చూపించుటయే శుద్ధతాన మని··· రిచే ననగ రెండు రాగములు ప్రకాశిల్లునట్లు చూపించుటయే కూటతానమనియు గలదు. దీని కుదాహరణ ముగ సుబ్బరామదీక్షితులవారు తమసంగీత సంప్రదాయప్రదర్శినియను గ్రంథరాజమందు కాంభోజియనురాగమున కాకలినిషాదమును అవరోహణమందు (సనిపదసా) అను ప్రయోగమందు మాత్రము పట్టుట ఆచార ముగ నుండినందున తానముగూడ నట్లే సం చారము చేయవలసియుండవలయును గనుక నిది రెండురాగములుగ ప్రకాశింపచేయుట మాత్రము గలుగనేరదనియు వ్రాసియున్నారు. ఈతానభేదములలో షాడవఔడవము లని యు గలదు. కొందఱు, తానసంఖ్య మున్నూట ముప్పదియారు యనియు భరతులు చతురశీతి యనియు, ఉత్తరవ్యాఖ్యయందు "షడ్జగాస్సప్త, మధ్యమే సప్త" అను సంఖ్యోపపాదన మనుప పన్న మగున··· ది. కనుక శుద్ధములనగ

"కాకల్యస్తరరహితత్వ" మనియు "వ్యుత్క్రమణో చ్చారిత స్వరరహితత్వం" అనియును కల్లినాథులు వ్రాసియున్నారు. సప్తస్వరములలో షడ్జముతక్క శేషించిన ఆరుస్వరములయం దొక్కొక్కస్వరలోపముచే షాడవములగుచున్నవి. షడ్జముమాత్ర మేలలోపమనగ అదిశ్రుతియగుటచేతను శ్రుతిలేనిపాట సమ్మతి కాదు గనుకను షడ్జవర్జము మాత్రము నిషిద్ధము. ఇట్లే నియతస్వరద్వయలోపమువలన నౌడవము లగుచున్నవి.

శ్లో. షడ్జగా స్సప్తహీనా శ్చేత్ క్రమాత్ సరిపస ప్తమైః, తథాఽష్టవింశతి స్తానాః మధ్యమేసరిగోజ్ఝితాః; సప్తక్రమాద్యదా తానా స్స్యు స్తదా త్వేకవింశతిః, ఏతేచైకోనపంచాశ దుభయే షాడవామతాః; (యుతాః)

సపాభ్యాం ద్విశ్రుతిభ్యాంచ రిపాభ్యాం సప్తవర్జితాః, షడ్జగ్రామే పృథక్తానాః ఏకవింశతి రౌడవాః; రిధాభ్యాం ద్విశ్రుతిభ్యాంచ మధ్యమగ్రామగాస్తు తే, హీనా శ్చతుర్దశైవ స్యుః పంచత్రింశత్తుతే యుతాః; సర్వే చతురశీతి స్స్యుః మిళితాః షాడవౌడ వాః.

(రత్నాకరం, సంll దర్పణం)

ఈ మూర్ఛనాదికములం దుత్పన్నములగునవన్నియు తానములనియో కూటతానములనియో యనవచ్చునుగాని, తానములన్నియుమాత్రము మూర్ఛనలని చెప్పఁగూడదు. బ్రాహ్మణుల కందఱకును జందెమున్నదిగాని జందెమున్నవారెల్ల రు బ్రాహ్మణులే యని చెప్పగూడదు. ప్రథమమున షడ్జగ్రామసంబంధములగు మూర్ఛనాదులందు నొక్కొక దానియందు నను శుద్ధతానములందు వికృతస్వర వర్జము గావలెను. దీనియందు షాడవములు సరిపనియను స్వరములవరుసగ వర్జముచేయ ($4 \times 7=28$) నిరువది యెనిమిది షాడవతానములు వర్జము లౌచున్నవి. ఇట్లే మధ్యమగ్రామమునందు స, రి, గ,ముల వలన వర్జములను షాడవము లిరువదియొకటి ($3 \times 7=21$) యగుచున్నది. యీ రెండును చేరి ($28+21=49$) నలువదితొమ్మిది యగుచున్నవి.

మరియు షడ్జగ్రామమున రెండుశ్రుతులు తగ్గించుటచే నౌడవములు గల్గుటచే, సప, గని, రిప, ఈ స్వరములు శుద్ధతానములందు వర్జనీయములు గనుక $3 \times 7=21$ శుద్ధతానము లేర్పడుచున్నవి.

ఇట్లే మధ్యమగ్రామమున రిధ, గని ఈ రెండువర్జనీయము లౌటచే, $2 \times 7=14$ శుద్ధతానములు; గనుక నీగ్రామద్వయమున చేరి $21+14=35$ అగుచున్నవి. అన్నియు షాడవౌడవములు చేరి $49+35=84$ భరతులవారి మతానుసారము చతురశీతియని యేర్పడుచున్నదని తాత్పర్యము. ఇక కూటతానవిషయము:

శ్లో. అసంపూర్ణాశ్చ సంపూర్ణాః వ్యుత్క్రమోచ్చారితస్వరాః, మూర్ఛనాః కూటతానా స్స్యు రితి శాస్త్రవినిర్ణయః.

అనగ సంపూర్ణములనియు, నసంపూర్ణములనియు, వ్యు... ...స్వరము

లనియు కూటతాన భేదములని శాస్త్ర నిర్ణయము.

శ్లో. పూర్ణాఽపూర్ణాదిసంఖ్యాశ్చ పునరుక్తాప సారణాః మూర్ఛనాః కూటతానాస్స్యు స్తేషాం సంఖ్యాఽభిధీయతే.

(సం॥ రత్నాకరం, దర్పణం.)

అనగ సంపూర్ణాసంపూర్ణ సంఖ్యాదిక ములందు కొన్ని పునరుక్తములౌట స్పష్టము; సులభవేద్యము. మూర్ఛనలందలి పునరుక్తి గల్గునట్టివి కూటతానములు. వీటిసంఖ్యా పరిగణన వివర మెట్లనిన:

శ్లో. పూర్ణాః పంచసహస్రాణి, చత్వారింశ ద్యుతానితు, ఏకైకస్యాం మూర్ఛనాయాం కూటతానా స్సహక్రమైః; షట్పంచాశత్ మూర్ఛనాస్తాం పూర్ణాః కూటాస్తు యోజితాః, లక్షద్వయం సహస్రాణి ద్వ్యశీతి ర్ద్వేశతే తథా; చత్వారింశత్తు సంఖ్యాతా అథాఽ పూర్ణాః ప్రచ క్ష్మహే. సం॥ రత్నాకరం, దర్పణములు.

అనగ నొక్కొక్క మూర్ఛనయందు నను పూర్ణకూటతానము ఏడుస్వరములుగల వని తాత్పర్యము. సంఖ్యక్రమముగ నైదువేల నలువది (5040) యగుచున్నది. గనుక 56 సంపూర్ణమూర్ఛనలందు $56 \times 5040 = 282240$ గల్గుచున్నవి. ఇది సంపూర్ణ కూటతానవివ రము. పిమ్మట అసంపూర్ణముల సంగతి వ్రాయ బడును.

శ్లో. ఏకైకస్యాన్త్యవిరహాత్ భేదా షట్స్వ రాదయః, ఏక స్వరోఽత్ర నిర్భేదోఽ న్తే.

అనగ మూర్ఛనాన్త్య స్వరలోపక్ర మమున నారుభేదము లేర్పడుచున్నవి. నిషాద వర్జమువలన, (1) సరిగమపద, యును, పున రన్త్యస్వరలోపమున (2) సరిగమప, యు, నిట్లే (3) సరిగమ (4) సరిగ, (5) సరి, (6) స ఇట్లారు గల్గుట స్పష్టము. దీన నారవదియగు ఏకస్వరము నిర్భేదకమగుటచే నష్టతాన సంఖ్యాసిద్ధికై తోడ్పడుననియు, గలదు.

శ్లో. క్రమాత్కూటతానత్వే వ్యక్త స్తేషూప యోగినః, స్యు ష్షాడవానాం వింశత్యా సహస ప్తశతానిచ; ఔడవానాంతు విం శత్యా సహితం శత ముచ్యతే, చతుస్స్వ రాణాం కుటానాం చతుర్వింశతి రీరితాః; త్రిస్వరాష్షట్ ద్విస్వరౌ ద్వా వేకస్త్వేక స్వరో మతః.

(సం॥ రత్నాకరం, దర్పణం.)

వీటి సంఖ్యను గూర్చి ఇట్లు చెప్పి యున్నారు. షాడవకూట తానములు (6 స్వరములు గల్గినవి) 720 అనియు, ఔడ వములు 120 అనియు, చతుస్స్వరయుత ములు 24 అనియు, త్రిస్వరయుతములు 6 అనియు, ద్విస్వరయుతములు 2 అనియు ఏకస్వరతానము నిర్భేదకమై అనియు వ్రాసి యున్నారు.

శ్లో. ఆర్చికో. గాధిక శ్చైవ సామికోఽథ స్వరాంతరః; ఏకస్వరాదితానానాం చతు ర్ణా మభిధా ఇమాః.

ఏక, ద్వి, త్రి, చతుస్స్వరయుతములగు తానములకు గ్రమముగ, ఆర్చిక, గాధిక, సామిక, స్వరాంతరములని పేర్లు. "యజ్ఞ

ప్రయోగేషువృచమేకః స్వరాశ్రయత్వాత్ ఆర్చిక" అనియు "తదా గాథా సంబంధాత్ గాథిక"యనియు, 'సామసంబంధాత్ త్రిస్వర స్థానః సామికః' అనియు, నీయేడుతానములకు మధ్యనుండుటచే స్వరాన్తరమనియు సంజ్ఞలు గల్గిన వనిరి,

శ్లో. ఉక్తా శ్శుద్ధాదిభేదేన నిగయుక్తా శ్చతుర్విధాః, తయోరేకైకహీనా స్తే ద్వేధా మూలక్రమా మతాః.

(సం॥ రత్నాకర దర్పణములు.)

శుద్ధాది భేదమువలన గాన్ధార నిషాద స్వరయుక్తతానములు నాల్గు విధము లనిరి. ఎట్లనిన:

| | |
|---|---|
| 1. నిసరిగమప | శుద్ధస్వరములు |
| 2. ని(కాకలి)సరిగమప | సకాకలీ |
| 3. నిసరిగ(అంతర)మప | సాంతగ |
| 4. ని(కాకలి)సరిగ(అంతర)మప | సకాకల్యన్తర |

| ఉదాహరణము | షడ్జగ్రామము | మధ్యమగ్రామము |
|---|---|---|
| 1. | సరిగమ పదని | మపదనిసరిగ |
| 2. | నిసరిగమపద | గమపదనిసరి |
| 3. | దనిసరిగమప | రిగమపదనిస |
| 4. | పదనిసరిగమ | సరిగమపదని |
| 5. | మపదనిసరిగ | నిసరిగమపద |
| 6. | గమపదనిసరి | దనిసరిగమప |
| 7. | రిగమపదనిస | పదనిసరిగమ |

ఈ గ్రామమూర్ఛన లందున నొక్కొక స్వరవర్జముచే షాడవము లౌ చున్నవని సందుల కుదాహరణము:

| | షడ్జగ్రామషాడవములు | మధ్యమగ్రామషాడవములు |
|---|---|---|
| 1. | స రి గ మ ప ద × | మ ప ధ ని స రి × |
| 2. | ని స రి గ మ ప × | గ మ ప ద ని స × |
| 3. | ధ ని స రి గ మ × | రి గ మ ప ద ని × |
| 4. | ప ద ని స రి గ × | స రి గ మ ప ద × |
| 5. | మప దని స రి × | ని స రి గ మ ప ద × |
| 6. | గమ ప ద ని స × | ధ ని స రి గ మ × |
| 7. | రిగ మప ద ని × | ప ధ ని స రి గ × |

పై నుదాహరించినటుల × ఈ గుర్తు అన్త్యస్వరలోపమని తెలియునది. పదునాలుగు మూర్ఛనలలో మొదటిదానియందు షాడవ మగుటకు నిషాదలోపమువలన నైనది. ఇట్లే మధ్యాదిషాడవ తానమునందు "గ" లోపమువలన నైనదనుట స్పష్టము. పైనుదహరించిన నాల్గుమార్గముల ననుసరించి రెండు గ్రామములందునను 4 + 4= 8 మార్గములు. పదునాల్గింటిని నీ నాల్గుమార్గములు ప్రయోగించిన 4 × 10=40. మొత్తముచేరి 40 + 8 =48 అని సంఖ్య తేలుచున్నది.

శ్లో. సవింశతి స్సప్తశతీః ప్రాగుక్త గుణితాః క్రమైః, చతుస్త్రింశత్సహస్రాణి షష్ఠ్యాపంచశతానిచ. ఇతి షాడవసంఖ్యా స్యాత్ అథపంచస్వరాన్ బ్రువే.

(సం. దర్పణం)

పైన షాడవసంఖ్య 720 అనిచెప్పబడినది. వీటిని క్రమముగ నిపుడుచెప్పిన 48 మార్గములచే గుణింప 48 × 720=34560 షాడవకూటతానసంఖ్యయని తేలుచున్నది. ఇక నౌడవతాన. లేక పంచస్వరతానసంఖ్యగూర్చి చెప్పబడుచున్నది.

## శ్రీరాగము



శ్లో॥ అష్టాదశాబ్ద స్మర చారుమూర్తిః; ధీరో లసత్పల్లవకర్ణపూ
షడ్జాదిసేవ్యో ఒరుణ వస్త్రధారీ, శ్రీరాగ ఏష క్షితి



## మాళవ శ్రీరాగిణి



రక్తోత్పలం హ స్తతలే దధానా, విభావయన్తీ తను దేహవల్లీ;
రసాల వృక్షస్య తలే నిషణ్ణా, స్తోకస్మితా సా కిల మాళవశ్రీః.

శ్లో. గాద్యా ధాద్యా నిషాదాద్యా చతుర్భేదా షడౌడవాః, అష్టావన్యే ద్విధేత్యేవం చత్వారింశ దిమే క్రమాః.

(సం॥ దర్పణం)

షాడవతానమార్గములందువలెనే వీనిలోగూడ $4 \times 6=24$, $24+16=40$ మార్గములనియుగలదు. దీనివివరము ముందుసంచికయందు విస్పష్టముగ వ్రాయబడును.

శ్లో. సంవిశతౌ శతే త్రైశ్చ గుణితేఽష్టౌ శతానిచ, చత్వారిచ సహస్రాణి సంఖ్యాః పంచ స్వరే ష్వితి.

(సం॥ దర్పణం)

పైనుదాహరించినట్లు ఔడవతానభేదములు 120 యందునను నీనలువదిమార్గముల ప్రస్తారముచేయుటచే $40 \times 120=4800$ అని తేలుచున్నది.

శ్లో. చతుస్స్వరేషు న్యాద్యా ద్వా చతుర్ధా ద్వాదశాపరే, క్రమాద్ద్విధేతి ద్వాత్రింశచ్చతుర్వింశతి తాడితాః. శతాని సప్తషష్ట్యా స్యా చ్చతు స్స్వరసమ్మితిః;

నాల్గుస్వరములుగలతానభేదములకు మార్గములు 32. దీనికి చతుస్స్వరకూటమగు "24" చే నెచ్చించగ $=24 \times 32=768$ గల్గుచున్నవి.

శ్లో. త్రిస్వరేషుతు మాద్యాద్యా వభేదా ద్వాదశాపరే; ద్విధా షడ్వింశతిరితి క్రమాస్తే షడ్భి రాహతాః. షట్పంచాశచ్ఛతంచ స్యుఃద్విస్వరేషుపున ర్ద్విధా, రిగధన్యాదయోఽష్టౌ స్యు శ్శుద్ధాత్త దితరే క• ... షు చైవం చత్వారింశద్ధి తాడితాః, ఏకస్వర స్త్వభేదత్వా న్మాలాపవ చతుర్దశ.

త్రిస్వరకూటతాన భేదములు $26 \times 6 =156$ అనియు, ద్విస్వరకూటతానభేదములు $22 \times 2=44$ అనియు ఏకస్వరకూటతానభేదములు పదునాల్గనియు (14) చెప్పియున్నారు.

శ్లో. షడ్జాద్యై శ్శుద్ధమధ్యాయా భేదకం పంచమం వినా, చతుస్స్వరే క్రమద్వంద్వేఽష్టాచత్వారింశ దీరితాః; తానా స్త్రిస్వరయో స్త్వేతే ద్వాదశద్విస్వరే ద్వయమ్, ఏకఏకస్వర స్తేత్రి షష్టి రౌత్తరమంద్రకైః; పునరుక్తామతా స్తానైః న్యాదిమార్గ క్రమా పునః, పంచస్వరా యే చత్వారః తత్తానానాంచతుశ్శతీ; అశీత్యభ్యధికాచాతుస్స్వరేషణ్ణవతిర్భవేత్, ద్వాదశ త్రిస్వరద్వంద్వే చత్వారోద్విస్వరద్వయే; ఏకఏకస్వరస్తాన స్తేషాంపంచశతీ త్రియమ్, త్రిణవత్యాయుతా తానై రభిన్నా రజనీగతైః; ధైవతాదేస్తుపౌరవ్యా శ్చత్వార షట్స్వరాః క్రమాత్, తత్తానానాంతు సాశీతిః శతాష్టావింశతి ర్మతాః; ఔడవానాం చతుర్ణాం ప్రాగుక్తా స్సంఖ్యా శ్చతుస్వరాః, త్రిస్వరా ద్విస్వరా వేక స్వరః ప్రాగుక్తసంఖ్యకాః; పంచవింశతిసంయుక్తా చతు స్త్రింశచ్ఛతీ త్రియమ్, తానానాం సదృశాకారా స్స్యత్తానై రౌత్తరాయతైః; ఇ త్యేకాశీతి సంయుక్తం సహస్రాణాం చతుష్టయమ్, తానానాం పునరుక్తానాం పూర్ణాపూర్ణై స్సహ క్రమైః; అపనీయేత చేదేషా కూటతానో

మతి ర్భవేత్, లక్షత్రయం సప్తదశ సహస్రాణి శతానిచ; నవత్రింశత్యుతాసీతి ర్జ్ఞానోపాయోఽత్ర కథ్యతే.

(రత్నాకరం, దర్పణం)

ఈతానభేదము లేయేమూర్ఛనలందు పునరుక్తము లగుచున్నవో దానిసంఖ్య నిట్లు వివరించియున్నారు. వీటివివరము నీచక్రమున గమనింప స్పష్టమగును. దీనికిపిమ్మట నష్టసంఖ్యాపరిజ్ఞానవిషయము, కూటప్రస్తారము, ఖండమేరు ప్రస్తారము మొదలగునవి ముందు సంచికయందు వ్రాయబడును.




పౌనరుక్త కూట తాన సంఖ్యా నిరూపక చక్రము.

| జాతి | పౌరవియందు (ఉత్తరాయతా) | మార్గియందు (రజనీ) | శుద్ధమధ్యయందు (ఉత్తరమంద్ర) | మూడింటి మొత్తం | పూర్ణాఽపూర్ణ క్రమసంఖ్య | క్రమ పునరుక్త సహిత కూట తానసంఖ్య |
|---|---|---|---|---|---|---|
| పూర్ణాః | — | ... | ... | ... | 392 | 2,82,240 |
| షట్స్వరాః | 2880 | ... | ... | 2880 | 48 | 34,560 |
| పంచస్వరాః | 480 | 480 | ... | 960 | 40 | 4,800 |
| చతుస్స్వరాః | 48 | 96 | 48 | 192 | 32 | 768 |
| త్రిస్వరాః | 12 | 12 | 12 | 36 | 26 | 156 |
| ద్విస్వరాః | 4 | 4 | 2 | 10 | 22 | 44 |
| ఏకస్వరాః | 1 | 1 | 1 | 3 | 11 | 14 |
| మొత్తం | 3425 | 593 | 63 | 4081 | 571 | 3,22,582 |

| | | |
|---|---|---|
| పునరుక్త తానభేదములు | | 4081 |
| పూర్ణాఽపూర్ణ క్రమం | | 571 |
| పూర్ణాఽపూర్ణసహిత కూటతానములు | | 4652 |
| క్రమ పునరుక్తసహిత కూటతానములు | | 322582 |
| పూర్ణాఽపూర్ణసహిత కూటతానములు | | 4652 |
| కూటతానముల మొత్తం | శేషం | [illegible]30 |

ఇందు శ్రీరాగకుటుంబము అనగా పంచభార్యా సహిత శ్రీరాగముయొక్క స్వరూప ధ్యానాదికము లుదహరింప బడు చున్నవి.

శ్రీరాగము

శ్లో. షడ్జే షాడ్జీ సముద్భూతం శ్రీరాగం స్వల్పపంచమమ్,సన్యాసాంశగ్రహం మన్ద్రి గాంధారం తారమధ్యమమ్; సమశేష స్వరం వీరే శాస్తి శ్రీకరణాగ్రణీ.

(సం. రత్నాకరం.)

శ్లో. శ్రీరాగ స్సగ్రహః పూర్ణ శ్చారోహే చాల్పధైవతః; అవరోహే గవక్రం స్యాత్సాయంగేయ శ్శుభావహః.

(చతుర్దండిప్రకాశిక.)

శ్లో. శ్రీరాగ స్సచ విఖ్యాత స్సత్రయేణ విభూషితః, పూర్ణ స్సర్వగుణోపేతో మూర్ఛనా ప్రథమా మతా; కేచిత్తు కథయం త్యేనం ఋషభత్రయ సంయుతమ్.

(సం. దర్పణం.)

శ్రీరాగము

రాగధ్యానము:—

శ్లో. అష్టాదశాబ్ద స్స్మరచారుమూర్తిః ధీరో లసత్పల్లవకర్ణపూరః, షడ్జాదిసేవ్యోఽరుణ వస్త్రధారీ శ్రీరాగ ఏష క్షితిపాల మూర్తిః.

(సం. దర్పణం.)

రూపము:—పద్మమునుగాని లేక వీణను గాని చేతబూని స్ఫటికాక్ష మాలాధారియై శ్వేతారుణ వస్త్రములధరియించి పదునెనిమి దేండ్ల — రెండవ మన్మథునివలె శోభిల్లుచుండుననియు, ఉద్యాన వనమందు హాయిగ గూర్చుని గానము జేయుచుండి నట్లును, గలదు. మరికొందఱ మతమున, రత్నకిరీటము ధరించి చేత కరవాలముబూని సింహాసనాసీనుండై యున్నట్లును గాయకులు గానముజేయుచుండ చక్కనిస్త్రీ లాతనితో సల్లాపములాడి సంతోష పెట్టుచున్నట్లును గలదు. ఈరాగము సాయంకాలమున పాడ దగిన దనిరి. మఱికొందరు పగలు రెండవ యామమునందు గానముచేయవలెననిరి. యీ వాడుకనుబట్టి ప్రస్తుతముగూడ ఉదయము 9 గంటలుమొదలు మధ్యాహ్నము 12 గంటల వరకు గానముచేయుట గలదు. కాని ఎప్పుడు పాడినను సర్వమంగళకరమనియు గలదు. దీనికి స్వరము:—సరిగమపదనిస. అథవా:— రిగమ పదనిసరి.

(సం. దర్పణం.)

మాళవశ్రీరాగిణి

శ్లో. సమస్వరా తారమంద్ర షడ్జాంశన్యాస షడ్జభాక్.

(రత్నాకరం.)

శ్లో. మాళవశ్రీరాగాంగా, పూర్ణా సత్రయ భూషితా, మూర్ఛనోత్తరమంద్రా స్యాత్ శృంగారరసమండితా.

(సం. దర్పణం.)

ధ్యానము:—

శ్లో. రక్తోత్పలం హస్తతలే దధానా విభావయన్తీ తనుదేహవల్లీ, రసాలవృక్షస్య తలే నిషణ్ణా స్తోకస్మితా సా కిల మాళవశ్రీః.

(సం. దర్పణం.)

రూపము :—

ప్రియవియోగిని యయ్యు వృక్షచ్ఛాయ యందు విశ్రమించి చేడియతో హాస మొన రించుచున్నట్లును, అప్రతిమానమగు సౌంద ర్యము గల్గి రక్తాంబరముల దాల్చి పీతవర్ణపు మేలిముసుగు ధరించినట్లును నుడివియున్నారు. మఱికొందఱు పద్మహస్తయై, చూతతరు మూలమున సింహాసనముపై నధిష్ఠించి, తన కట్టెదుర నాడుచు పాడుచున్న తన చేడియల తో కాలక్షేపము చేయుచున్నట్లు వ్రాసి యున్నారు. దీనికి స్వరము:—సరిగమపదనిస.

(సం. దర్పణం.)

మాళవిరాగిణి

శ్లో. ఔడవా మాళవీ జ్ఞేయా, నిత్యా రిప వర్జితా, రజనీ మూర్ఛనా చాత్ర కాకలీ స్వరమండితా.

ధ్యానము:—

స్వకాన్తసంచుంబిత వక్త్రపద్మా శుక ద్యుతిః కుండలినీ ప్రమత్తా, సంకేతశాలాం విశతీ ప్రదోషే మాలాధరా మాళవికేయ ముక్తా.

రూపము :—సువర్ణ చేలాంచలము ధరించి, పుష్పైకాభరణభూషితయై సాంకేతిక నిర్దిష్ట స్థలోపవిష్టయై సంపూర్ణమోహావేశము తో చుంబనోత్సుకుడగు భర్తను తదేకదృష్టిని విలోకించుచున్నట్లు వర్ణింపబడినది. కొందఱు, పత్యాగమనమునకై నిరీక్షించు చున్నట్లును మరికొందఱు తనప్రభునితో రహస్యగోష్ఠి సల్పుచున్నట్లును వర్ణించియున్నారు. స్వరము =నిసగమధని.

(సం. దర్పణం.)

ధనాశ్రీ=ధనాసరి=ధన్యాసి

శ్లో. దూర్వాదళశ్యామతను ర్మనోజ్ఞా కాంతం లిఖన్తీవిరహేణదూనా, శ్వేతేకపోలే దధతీ దృగమ్బు నిష్యందినీ ధౌతకుచా ధనాశ్రీ.

రూపము:—దూర్వాదళ శ్యామకాంతిగ ల్గుమైచాయతో సుందరమగు మోముతో ప్రియ విరహాకులచిత్తయై కాంతుని విగ్రహము లిఖింపుచు కన్నుల రాల్చున శ్రువులు పాండుర మగు కపోలముల దడిపి అనంతరము కుచము లను ప్రక్షాళనము చేయుచున్నట్లు వర్ణించిరి. మరియు రక్తాంబరముల ధరించి యుపవన మందు మోరశ్రీ (?) తరుఛాయోపవిష్టయై ప్రియగమనోత్కంఠయై యున్నట్లు వర్ణించి యున్నారు దీనికిస్వరము:—సగమపదనిస.

(సం. దర్పణం.)

వసన్తీ=వసన్త=వసన్తము.

శ్లో. వసన్తీ స్యాత్తు సంపూర్ణా సత్రయా కథితా బుధైః, శ్రీరాగ మూర్ఛనైవాత్ర జ్ఞేయా రాగవిశారదైః.

(సం. దర్పణం)

ధ్యానము:—శ్లో. శిఖండిబర్హోచ్చయబద్ధచూడా, కర్ణావతంసీ కృతశోభనామ్రా, ఇందీవరశ్యామతను స్సుచిత్రా వసంతికా స్యా దళిమంజుళశ్రీః.

రూపము :—ఝుమ్మను తుమ్మెదలచే నావరింపబడి, మయూర పింఛాలంకృతమగు శిరోచూడము గల్గి, లేమామిడి చిగుళ్లను పుష్పములను కరపల్లవమున ధరించి, శ్వేత, రక్తాంబరముల దాల్చి, హరిద్రాచూర్ణము బూర్ణముగ మైనలంది, ఉపవన తరుఛాయయం దుపవిష్టయై భర్తృహ్లాదయాకర్షణ సంతో షజనకోపాయాన్వే యని

వర్ణించి యుండిరి. కొందఱు శ్రీకృష్ణునితో వసన్తోత్సవము (హోళీపండుగ) జరుపుచున్నట్లూహించి మఱికొందరు తనచేడియలతో నాటపాటలయందు నిమగ్నచిత్తయై యుండినట్లును దెలిపిరి. వసన్త ఋతువునందు గానము సేయదగుననిరి.

దీనికిస్వరము :—సరిగమపదనిస.

(సం. దర్పణం.)

ఆసావరీ=ఆశావరీ= అసావేరి.

శ్లో. అసావరీ గనిత్యక్తా ధగ్రహాంశాచ షౌడవా, న్యాసస్తు ధైవతో జ్ఞేయః కరుణారస నిర్భరా.

అథవా, శ్లో. కుకుభాయాః సముత్పన్నా ధాంతా మాంశగ్రహా మతా, పంచమేనైవ రహితా షాడవాచ నిగద్యతే.

(సం. దర్పణం.)

ధ్యానము:—శ్రీఖండశైలశిఖరే శిఖిపింఛవస్త్రా, మాతంగ మౌక్తికమనోహర హార వల్లి, ఆకృష్య చందనతరో రురగం వహన్తీ, ఆసావరీ వలయ ముజ్జ్వల నీలకాన్తిః.

(సం. దర్పణం.)

రూపము:—ధౌతవస్త్రముల ధరించి, సర్పాభరణముల దాల్చి నీలదేహచ్ఛాయ గల్గి, నుదుట చందన మలది పుష్పమాలికల ధరించి యుపవనమధ్యస్థతరుమూలస్నిగ్ధశీతల ఛాయాసీనయై యుండినట్లును, తత్ పరిమళము తదుపాన్తసీమలందు వ్యాప్తమౌచున్నదని యు వర్ణించిరి. కొందఱు, పర్వతాగ్రమున స్వచ్ఛోదకమం దుపవిష్టయై యున్నదనిరి. మఱికొందఱు పర్వతాగ్రమున చందనతరుమూలమున అత్తిఆకును గుహ్యప్రదేశమున కడ్డువైచికొనుట తప్ప దిగంబరాకారముగల్గి వివస్త్రయై పుంగీవాద్యవినోదము సల్పుచున్నట్లు గలదనిరి. రెండు పెద్దసర్పములును, బర్హబహుళము గలిగినమయూరములును శ్రద్ధగా సామగానమును వినుచు నానంద పారవశ్యము నొందుచున్నవనియు గలదు. స్వరము:—ధనిసమధ. అథవా మధనిసరిగమ.

(సం. దర్పణం.)

---

# అనుతాపము

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

శ్రీకల్యాణగుణాకరుండ వయి నిర్ణిద్రప్రభావుండవై
లోకానందముఁ గూర్చువాఁడవయి మేలుం గీడుఁ గల్పించి నా
వాకుల్ సేరనిచోట నిల్తువుగదా వర్ణింపఁగా శక్యమే
నీకారుణ్యపుఁద్రోవ యిట్టిదని తండ్రీ! దీనచింతామణీ!

మ. బహుళార్తిం బడియున్న యప్డు డది నైర్ఘణ్యలేక నిన్నున్న న
న్వోహముల్ నిడద యొనర్చుచుండు నది చింతాకంత చల్లారినన్
విహ... దమి మోహవారినిధి నువ్విళ్లూరుచిత్తంబుతో
నాచరిత్ర మిది తండ్రి! దీనచింతామణీ!

శా. నే నీచుండ నటంచు నొక్కపరి నన్నిందించుకొందున్ భయా
ధీనస్వాంతుడనై మహామరణవార్ధింగూలిన ట్లింత యో
గానిం జెందుదుఁ దత్పరక్షణమునన్ బ్రహ్మచక్రముం ద్రిప్పఁగా
నేనే చాలెదనంచు నిక్కెదను తండ్రీ! దీనచింతామణీ!

శా. ఆనందాకృతిఁ దాల్చి లోకములలో వ్యాపించియున్నావు నీ
యానం దాల్చి పిపీలికాదికము బ్రహ్మాంతంబు నౌసృష్టి య
జ్ఞానిం బుట్టుచు గిట్టుచున్నయది యేలా నాకుగర్వంబు? హా!
నేనెవ్వండను గార్యముల్ సలుపఁ దండ్రీ! దీనచింతామణీ!

శా. కల్పంబుల్ గతియించె సృష్టిగతు లక్షయ్యంబుగా మారెఁ బె
ద్వేల్పుల్ పుట్టిరి గిట్టి రట్లయిన నీవెం దొక్కఁడై నిల్చె హా!
యల్పజ్ఞుండ నెఱుంగలేను నిను నా కారాటమేలా మదిన్
నిల్పం జేయుము నిన్నుఁ జాలునది తండ్రీ! దీనచింతామణీ!

శా. ఆహ్లాదదు నీవనుజ్ఞ యిడకే యాపత్తొ సంపత్తొ యే
దో కల్పింతువు నీదుసృష్టి కది యెట్లో [illegible] నూహించుటల్
నీకే చెల్లును జెల్ల దింకొకనికిన్ నేనెవ్వఁడన్ మూఢుఁడన్
నీకుం జెప్పఁగ నేర్తునే జడుఁడఁ దండ్రీ! దీనచింతామణీ!

శా. ఆపత్తే దియొ యెదిసంపదయొ యావంత్తైన రూపింపఁగా
నోపన్ సంపదకల్గినప్పు డది యెంతో యాపదే యంచుఁ బె
ల్లాపత్తైనపు డద్ది సంపదయటం చట్లెట్లు భావించి నా
యేపుం గోల్పడుచుండు వ్యర్థముగఁ దండ్రీ! దీనచింతామణీ!

శా. వానిం జంపెద వానిఁ గొల్చెదను నేవానిం బడంద్రోతు న
వ్వానిం జేల్చెద నంచు డంబముల నల్పంబౌ గతిం బల్కుదున్
హా! నీచుండను నే నొనర్పఁగలనే యందొక్కఁడై నం గటా!
యీ నాగర్వమడంప వేమిటికిఁ దండ్రీ! దీనచింతామణీ!

శా. గర్వంబేకద మూలమంత్రమయినన్ గష్టాలపాల్ సేసె దృక్
పర్వంబై [illegible]గు నీదుసృష్టి నెదుటన్ గన్పట్టు నీనేర్పు దు
స్సర్వజ్ఞత్వముచే నెఱుంగక మహా శాస్త్రముల్ చేసితిన్
నిర్వాణంబును జేర్తు వెట్లొ నను దండ్రీ! దీనచింతామణీ!

మ. ముందుఁ జూడన్ వెనుఁజూడ లేను [illegible] నిల్పి ముందు జూడ లే
ను నిమేషార్థము [illegible] దలంచెదను మున్నున్ మున్నుఁ గల్పింగ న
ల్పుని నన్నుం గన నెట్టి [illegible] జాలినం
దీనచింతంబున [illegible] తండ్రీ! దీనచింతామణీ!




జనమంచి శేషాద్రిశర్మ గారు

కావ్యములు శ్రవ్యదృశ్య భేదములచే రెండువిధములు. అందు శ్రవ్యకావ్యములు భారత భాగవత రామాయణాదులు. వీనియందుఁ బ్రధానముగ వర్ణింపఁబడునది కథాభాగము. దృశ్యకావ్యములు నాటకములనం బ్రఖ్యాతి నొందినవి. ఇవి మూలకథను బ్రధానము చేసికొని విచ్చలవిడి మార్పునొంది సదాచారము మొదలగువానిని బోధించుచుండవలయును. నాటకకర్తకుఁ గథనుమార్చునధికారము కలదుగాని యామార్పులచే మూలకథాసారమునకు మార్పు గలుగఁగూడదు.

నాటకమునందు భావపోషణము ప్రధానము. పాండిత్యమునుజూపి కవితచెప్పుటమాత్రము గాక సుబోధకమగునట్లు భావమును బోషించి తదుపయుక్తముగఁ బాత్రప్రవేశాదుల సమకూర్పవలయు. ఇదియే ప్రధానము. రసమును బోషింపక నాటకము వ్రాసినచో నది సజ్జనాదృతిం గాంచదు.

నాటకము చదువుటచే నాకాలపు లోకాచారములు స్పష్టముగఁ దెలియును. అదియే నాటకమునుజూచువారు నేర్చుకొనఁదగినది. కాని యిప్పటి పాటలు లోనగువానిని విని యానందించుట మాత్రముగాదు. అందేకాలపు నాయకుఁడు పేర్కొనంబడునో ఆమహాపురుషుని యౌదార్యాదులు, ఆకుటుంబములోని యాచారములు. ఆకాలపుజనుల వాక్ప్రవృత్తి, అభిప్రాయభేదములు లోనగునవి కరతలామలకము లగుచుండవలయును. అట్లుకాదేని యానాటకము లోకమున కుపకరింపదు.

[illegible]ప్రవేశాదులు యథేష్టముగనుండక లక్షణ [illegible] గును. పాత్రప్రవేశములు [illegible] జనాదులు ప్రధా[illegible]

ర్శింపఁదగవుగాన వాని నవాంతరపాత్రసంభాషణమునఁ దేటపడఁజేసి ముఖ్యకథాభాగమును బ్రదర్శింపఁజేయవలయు. దాన ద్రష్టలకు నాటకవస్తువు బోధపడును. ఎట్టిపామరులైనను అట్టినాటకమును జూచినపుడు దాని సారమును గ్రహించి నీతిని నేర్చుకొందురు.

సావిత్రీచరిత్రమును నాటకముగా వ్రాయునపుడు సావిత్రికిభర్తపైఁగల ప్రేమను బెంచి వ్రాయవలయును. ఆమె పతిభక్తి, అత్తమామలయందుంచిన భక్తి, ఆమె వనమధ్యభాగమున యముని దర్శించినపు డామె మనోధైర్యాదులు, విశేషించి చమత్కారముగ వ్రాయఁదగునే కాని మామగారి గ్రుడ్డితనము మొదలగు వానిని పరిహాసములో పెంచి వ్రాయఁగూడదు. సావిత్రి పితృగృహమున ననుభవించిన సుఖములనుగాని, అడవులలో నామె పడిన యిడుమలనుగాని వ్రా[illegible] గూడదు. సావిత్రీ నాటకము జూచువారు నేర్చుకొనఁదగిన నీతులు, పతిభక్తి, ధైర్యము, ఉచితజ్ఞత లోనగునవి కదా! కాఁబట్టి యానీతులు స్పష్టమగునట్లు నాటకవస్తువును నిర్వచింపవలయు. ప్రాచీనరాజచరిత్రములందు లోపములే యుండవని యెవ్వరు చెప్పఁజాలరుగాని నాటకము వ్రాయునపుడు, కవి యారాజకుటుంబాచారములనుబట్టి ద్రష్టలు చక్కని యలవాటులు నేర్చుకొనునట్లు వ్రాయవలయునే కాని యాచరిత్రమునందున్న లోపములను జూపి యిట్టి దురాచారములు పూర్వచరిత్రములందుఁ గలవుకదా యని తోఁపఁజేయరాదు.

[illegible]కమున వలయునన్ని మార్పులు చేసికొను నధికారము కవికిం గలదుగాని [illegible] నిర్వచనమునఁ దనశక్తి నుపయోగింపవలయునే కాని [illegible] న్నదున [illegible] సాగరచరిత్రమును

నాటకముగా వ్రాయఁదలఁచుచో నందుఁ జిత్రాంగిరాజపత్ని యనువిషయమును మఱువక, గొప్ప రాజకుటుంబమునందుఁ బుత్రుని మోహించునట్టి కుచరిత్రయుండెనని లోకులకుఁ దెలియకుండునట్లు చెప్పవలయు గదా యను బుద్ధిని నశింపఁజేయక యేదోయొక కారణమును గల్పించి యా చిత్రాంగి స్వబుద్ధిచే నట్టి యనుచిత కృత్యమును జేయఁబూనలేదనువిషయము ద్రష్టలకుఁ దోఁచునట్లు వ్రాయుటన్యాయమను నింగితము గలిగి తన చమత్కృతిని జూపవలయునేకాని యంతఃపురమున నిట్టివారు గలరని లోకులకుఁ దోఁపఁజేయునట్లు వ్రాయరాదు. ఇట్టివిషయములయందుఁ గవి తనశక్తిని వినియోగింపకున్న నదియొక నాటకముకాదు. భాషకది గౌరవము నొసఁగదు. నాటకములే భాషకు గౌరవమునీయఁజాలియుండును. ఈకాలమున నెవరాక్షేపించకున్నను భవిష్యత్కాలముననైన బుద్ధిమంతులు నాటకమును జదివినపుడు చప్పరింపరాదు. కాఁబట్టియే "కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ" అని మహాకవులు వచించిరి. ఒకప్పుడు కవియందున్న యసూయచేత నాటకమును బ్రదర్శింపకున్నను నెవరైన బుద్ధిమంతులు చూచి మెచ్చుకొన్నఁ జాలునని కవి సద్భావముతో నాటకమును వ్రాసి భాషాగౌరవమును బోషింప వలయును. నాలుగుచోట్ల నాటకమాడి చప్పట్లు కొట్టినంతమాత్రమున నది నాటకముగాదు; ఆమెప్పు మెప్పుకాదు. అట్లే యైనచో జెంచునాటకము ప్రథమతాంబూలార్హమగును.

ఇపుడిపుడు సూత్రధారుఁడుకూడ లేకుండునట్లు నాటకములు వ్రాయుచున్నారు. పదిమంది దానిని మెచ్చుకొనుచున్నారు. కాలము మాఱినకొలఁది నాటకలక్షణములు మాఱవలయుననువాద మొకటి బయలు వెడలినది. కాలముమాఱినంతమాత్రమున సదాచారముల మార్పఁబూనరాదు. నాటకోద్దేశము పూర్వచరిత్రములు ప్రదర్శింపఁగా వానింజూచి చక్కనినీతిని నేర్చుకొనవలయుననియేకాని రంగుపూసికొన్నవారిని జూచి యానందింపవలయునని కాదు.

భావము లనేకవిధములుగా మాఱుచుండునుగాని దాని ప్రథమోద్దేశము మాఱదు. రాజు మంత్రితో "భోజనముచేయఁబోవుదము రమ్ము" అని పల్కినచో నారాజుగౌరవ మెట్లుండునో మనము చెప్పనక్కఱయే లేదు. మార్పులనఁగా నిట్టివికావు. ఇవిమర్యాదను నశింపఁజేయునని. రాజు ఆస్థానమండపము నలంకరింపఁ బోవుచుండ నంతకుముందు దాని ప్రశంసయే లేకుండఁజేసినచో నవి రాజగౌరవము నశింపఁజేసినట్లే కాని వేఱుగాదు. ఏకాలముననఁగాని మర్యాదలు శాశ్వతములు. కాలానుసారముగ మార్పులనఁగా రాజు భృత్యునికృత్యములఁ జేయునట్లు, భృత్యుఁడు రాజకృత్యములు చేయునట్లు కాదు. ఇట్టి నాటకము లాభాషాగౌరవమును దుదముట్ట నశింపఁజేయునేకాని భాషాగౌరవమును గాపాడనేరవు. కాపాడనిచో నట్టినాటకము లుండియు లాభము లేదు.

నాటకమున భాషపాత్రోచితమై యుండవలయు ననువాదము ఇపుడు త్రోసివేయఁబడుచున్నది. ఐనను నీచపాత్రములకు సంస్కృత బహుళముగాక దేశభాషాపదములలో దేశ్యపదముల నుపయోగించి వ్రాయుట సముచితమని తోఁచెడి. కాని యిదియే శాస్త్రీయమార్గముకాదు. పాత్రోచితమగు భాష నుపయోగించుటయే యత్యుత్తమమార్గము. పూర్వమార్గములఁ బాటింపరాదనువారింతమాత్రమైన నంగీకరింపకుందురాయని వ్రాయవలసివచ్చినది. కాళిదాసాదులు పాత్రోచిత భాషనే కాపాడిరి. ఈ కాలపు మహాకవులుగూడ నాటకములగౌరవమును గాపాడి యాంధ్రభాష దేశభాషలలో గౌరవార్హమైనదన్న ఖ్యాతిని బోషింతురుగాక యని వారిని బ్రార్థించుచున్నాఁడను.



వసంతరాగిణి



శ్లో. శిఖండిబర్హోచ్చయ బద్ధచూడా, కర్ణావతంసీకృతశోభనామ్రా;
ఇందీవరశ్యామ తను స్సుచిత్రా, వసంతికాస్యా దళి మంజుళశ్రీః.



అసావేరి రాగిణి



శ్లో. శ్రీఖండశైలశిఖరే శిఖిపింఛవస్త్రా, మాతంగ మౌక్తిక మనోహరహారవల్లీ;
ఆకృష్య చందనతరో రురగం వహన్తీ, ఆసావరీ వలయ ముజ్జ్వలనీల కాన్తిః.

# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులుకారా?

చిలుకూరి వీరభద్రరావుగారు

(మొదటిసంపుటము-౧౧ వ సంచిక తరువాయి)

అంధఋషి (దీర్ఘతమస్సు) నిజముగా గ్రుడ్డివాఁడు కాఁడు. జాత్యంధుఁ డనఁగాఁ బుట్టుగ్రుడ్డివాఁడని యిటీవలి వ్యాఖ్యాత లర్థములు వ్రాసియున్నారు. జాత్యంధుఁడనగా నంధజాతివాఁడని యర్థముచేసి కొనవలయును. అట్లర్థముచేసికొనని యెడల నా గ్రంథకర్తల వ్రాఁత లస్వాభావికములు నప్రామాణ్యములై హాస్యాస్పదంబు లగుటయేకాక మానవుని నైసర్గికగుణవిశేషంబుల నెఱుంగఁజాలనంతటి పశుప్రాయులని గ్రంథకర్తలనుగూర్చి తలంప వలసివచ్చును. కాని యట్టిమహాగ్రంథములను రచించి ప్రఖ్యాతిఁగన్నవారు వ్రాసినకథల భావమును మనము సరిగా గ్రహించలేక పోవునట్టి దోషము మనదికాని వారిది కాదు. అనేకపురాణములు వీనిచరిత్రమును వాకొని యున్నవి. చిత్రవిచిత్రములై జ్ఞానద్యోతకము లగుచున్నవి. ఈతఁడు పుట్టుగ్రుడ్డివాఁడైనను అంధత్వము చిరకాలము నిలువంబడియుండ లేదు. తరువాత దృష్టికలిగినదనియు "దీర్ఘతమస్సు" అనునామమునకు బదులు గోతముఁడు లేక గౌతముఁడను నామమును వహించెనని బ్రహ్మా … ములు వక్కాణించుచున్నవి. మఱియు వీనిసంతానము బాలేయ క్షత్రియులు, బాలేయబ్రాహ్మణులు నైరఁట. మఱికొన్నిట నీతఁడు ఔశీనరియను శూద్రస్త్రీని వివాహము చేసికొని బిడ్డలను గాంచి తనబిడ్డలతోఁగూడ మగధరాజధానియైన గిరివ్రజపురమునకుఁ బోయి యచ్చట తపస్సు మూలమునను, కర్మసంస్కారముల మూలమునను బ్రాహ్మణులైరని చెప్పఁబడియుండెను. వీనికుమారుఁడైన కాక్షీవంతుఁ డనేకులను కోమాళ్లను గనెను. వారెల్లరు కూష్మాండ గౌతము లనంబడుచుండిరఁట. వాయుపురాణము ప్రతులలోఁ గొన్నిటమాత్రము వారు కృష్ణాంగగౌతములనివక్కాణింపఁబడియుండిరి. అన్నిటికంటె నితఁడు గావించిన మహాకార్యము నొక్కటి వివరింపవలసి యున్నది. ఆసేతు హిమాచల మధ్యస్థమైన యీభూభాగమునకు నెవ్వని నామముచేత భరతవర్షమని పేరుగలిగెనో యట్టి మహాచక్రవర్తియైన భరతునకు (దౌష్యంతి) మంత్రియై మహాపట్టాభిషేకము గావించినవాఁడే దీర్ఘతమస్సని యైతరేయ బ్రాహ్మణమున వక్కాణింపఁబడినది. (ఐ. బ్రా. ౮, అ. ౪. ౨౩). ఇక్కడ

సీతీఁడు కన్యాపుత్రుఁ డని వక్కాణింపఁబడి యుండెను. వీనియొక్కయు, వీనిసంతతిలోని వారియొక్కయుఁ, బేర్లతోఁ, బెక్కుమంత్రములు ఋగ్వేదమున సంపుటీకరణములు గావింపఁబడినవి. అనగాఁ బెక్కుండ్రు మంత్రద్రష్టలుగ నున్నారు. ఆంగీరసుఁడును, గోతముఁడను నామాంతరమునుగల యీ దీర్ఘతమస్సు దీర్ఘకాలము బ్రదికి యుండెనని ఋగ్వేదమున వాకొనఁబడినది. (ఋ.వే.మం. ౧.౧౫౮.౬). అంధఋషి యెట్టిజన్మ గాంచినను శైశవావస్థ నెట్టిపరిస్థితులలోఁ బెఱిఁగినను, బాల్యమున నెట్లు ప్రవర్తించినను, యౌవనమున నెట్టిమదోన్మత్తుఁడై తిరిగినను, వయస్సు గడచినకొలఁది బుద్ధిమంతుఁ డగుచు, తపోమహిమ గలిగి, వివిధసంస్కారములచే పూతుఁడై, మాంధాత మొదలగు రాజన్యవరులకుధర్మోపదేశకుఁడై దౌష్యంతియగు భరతునకుఁ బట్టాభిషేకముగావించి, వానిచే నశ్వమేధయాగమును జేయించి, వాని మంత్రియై వానికి జగత్ప్రఖ్యాతి గలిగించి మంత్రద్రష్టయై తుదకు దనపరిణామ చరిత్రమునందే యంధజాతివారి పరిణామచరిత్ర మిమిడియున్నదను జ్ఞానమును మనకుఁ బ్రసాదించుటకుఁ గారణభూతుఁడై, నేటికిని చిరంజీవియై మనమనస్సుల నాకర్షించుచున్నాఁడు. అతఁ డెంతటిసుకృతాత్ముఁడోకదా! ఇమ్మహనీయుని చరిత్రమును గూర్చి యెంతచెప్పినను తనివితీఱదు. గొప్ప రాజనీతివేత్తగ నున్నవాఁడు. గ్రంథవిస్తరభీతిచేత విరమించుచున్నాను. ఈ చరిత్రకథనమువలన మనము దెలిసికొనఁదగినది యీ దేశమునకు భారతవర్ష మను పేరు రాకపూర్వమె యాంధ్రు లీదేశమునఁ బ్రాంతకాపులై యున్నట్టు స్పష్టమగుచున్నది. "అంధ- అంధ్ర" అనుమాటలు శవికొకటేమో స్తరుగనుండునట్లు కనుపించుట తక్క మఱి యే సంబంధ మీ రెంటికిలేదు" అని శ్రీ వేంకట రంగయ్యగారు వ్రాసియున్నారు. కాని యీ చరిత్రాధ్యాపకునకు అంధ- నిషాదశబ్దములకు దగ్గిఱ సంబంధము గన్పట్టి అంధ- అంధ్ర శబ్దములకుఁ గనుపట్టకపోవుట యొక యద్భుత విషయమే. కాని, ఆంధ్రశబ్దమునకు నిషాద శబ్దము పర్యాయపదముగాఁ జెప్పఁబడియుండలేదు. బహుప్రాచీనకాలమునుండియు అంధ్ర నిషాదశబ్దములు రెండును వాఙ్మయమునందు గానంబడుచుండినను పర్యాయపదములుగా కుండుటకుఁ గారణమేమి? అదియునుగాక యాంధ్రశబ్దము జనరంజకమై శిష్టులవలనఁ గూడ వ్యవహరించుకొనఁబడుచున్నది. మన మాలలు మొదలగువారు తామాదిమాంధ్రులమని చాటుచున్నారుగాని తామాదినిషాదులమని చెప్పుకొను చుండలేదు. మఱియు నాంధ్రు లిట్టివారని నిరూపించి చెప్పుటకు వారిస్వరూప స్వభావాదులను వర్ణించు ఘట్టములు ప్రాచీనవాఙ్మయమునందుఁ గానరావు. నిషాదులను వర్ణించిన ఘట్టములు గలవు. ఆవర్ణనములు పొందికలేనివియును, నేకాభిప్రాయములు లేనివియు నైయున్నవి. వానిని వినిపింతు వినుఁడు. శ్రీ వేంకట రంగయ్యగారు శ్వేతవర్ణులయిన యైరోపీయునులే యార్యులనియు, ఆంధ్రులు గాదిమ

